విక్ర—శుభదత్తమ్మా! ఈచిన్నదానిని చెప్పవలదుకొన్నంతయూ చెప్పనిమ్మా. ఈమె యేమిచెప్పినను నాకు సంతోషమే. ఈమాటలవలన నాకెంత మాత్రమును నష్టములేదు. నామాటనమ్మి.

శుభ—విక్రమసేనా! నీవతికరుణాళుఁడవు; అతి శాంతుడవు—ఓసీ! క్షుద్ర దాసీ! నీవు నావెంటరా—విక్రమసేనా! మనము మరల కలిసికొందుము. మనమేర్పఱచుకొన్నది మఱచిపోకు.

విక్ర—మఱచిపోను.

శుభ—ఓసీ! కళావతీ! ఈయనయొద్ద మర్యాదతో సెలవు పుచ్చుకొనిరా.

కళా—నాప్రాణేశ్వరుఁడైన విజయపాలునికి సమస్త శుభములును కలుగును గాక!

శుభ—ఓసి నీనోరు పడిపోను! పాడుగండా! నీచదువు చాలును. ఈమాటతో నోరుమూసికొనిరా. (అని నోరునొక్కి కళావతిని బలవంతముగా నీడ్చుకొనిపోఁగా అందఱును నిష్క్రమించుచున్నారు.)



౪ రంగము—దామోదరవర్మయిల్లు.



[మంచిబట్టలు ధరించుకొని దామోదరవర్మయును, మాధవుఁడును
ప్రవేశించుచున్నారు.]

దామో—మాధవా! నేనిప్పు డందముగా నున్నానా?

మాధ—మహారాజులాగు వున్నారు. ఈక్రొత్తబట్టలవల్ల వెనుకటిరూపమే మారిపోయి యిప్పుడుమీకు యెక్కడలేని అందమూ వచ్చింది. మీ వెనుకటిరూపానికీ యిప్పటిరూపానికీ పోలికేలేదు.

దామో—ఈబట్టలవల్ల నంత మార్పు వచ్చినదేమి?

మాధ—మార్పోగీర్పో నేను చెప్పలేను. మీరు యీవేషంతో అవ్వగారియింటికి వెళితే ఆవిడ మిమ్మల్ని ఆనవాలే పట్టలేదు; మీకుమారుఁడు మీరుమీ పేరుచెప్పినా నమ్మడు; మనదాసీది మిమ్మల్నిచూస్తే యెవరో వింతమనిషి వచ్చినాడని జడుసుకుంటుంది వెయ్యిమాటలెందుకు? మీకుక్కకూడా మిమ్మల్ని చూస్తే మొరుగుతుంది.

దామో—మాధవా! అలంకారముతో సమానమయినది మఱియొకటి లేదు. లోపలికిపోయి పెట్టెనున్న నగలు మెఱుఁగు ముఖ్యముగా నుండవలెను.

మాధ—అందుచేతనే నాయిత్తడిగిన్నెకు మెరుగుపెట్టుమని రోజూ కంచరివానితో చెప్తుతాను. వాడు నామాటవినడు.

దామో—టపాలో నాకు ఉత్తరములేమైన వచ్చినవేమో చూచిరా.

మాధ—చూచివస్తాను. మీముఖం చూస్తే నాకు ముచ్చటవుతూవున్నది. (అని పోవుచున్నాఁడు.)

దామో—(ఇటునటు సుందరగమనముతో నడుగులు పెట్టుచు) ఇది హంసయానములాగున నున్నది! ఈపాదవిన్యాసము నేను నాట్యాచార్యునియొద్ద నేర్చుకొన్నాను. నాట్యాచార్యుఁడు తిన్నఁగా గ్రహింపలేక నాయడుగులు వేయుట నృత్యశాస్త్రానుగుణముగా లేదని తప్పుపట్టినాఁడు. నానడకలు దిద్దుటకు వానికేమి తెలియును? నా ముద్దునడక యభినయశాస్త్రమును మించియున్నది. నానడక దివ్యముగా నున్నది. మొన్న గ్రామదేవత జాతరలో అమ్మవారుపూనిన శివశక్తిసరిగా నావలెనే నృత్యము చేసినది.

[మాధవుఁడు మరల ప్రవేశించుచున్నాఁడు.]

మాధ-పురుషోత్తమదేవుఁడుగారు మీదర్శనంకోసం వచ్చినానని చెప్పుమన్నారు.

దామో—ఆయనతో రావచ్చునని చెప్పి నీవుపో.

మాధ—మంచిది. (అని మరలఁ బోవుచున్నాడు)

[పురుషోత్తమదేవుఁడుగారు ప్రవేశించుచున్నారు.]

పురు—దామోదరవర్మా! నిన్నిక్కడఁ జూడఁగలుగుటచేత నాకు పరమసంతోషముగా నున్నది.

దామో—నాకంతకంటె సంతోషముగానున్నది.

పురు—నీవింత యాకస్మికముగా పీఠికాపురపురమున కేమిపనిమీఁద వచ్చినావు?

దామో—కామదేవుని పనిమీఁద వచ్చినాను. కామదేవుఁడు నన్నిక్కడ కాళ పెట్టి తీసికొనివచ్చి తుదకు చిక్కులలో పడవేసినాఁడు. నాకిక్కడ గొప్పయవమానము తటస్థించినది. నన్నవమానపఱిచినవారి పేరులుమాత్రము మీకు చెప్పను. నాకెంతటి యవమానము సంభవించినదనుకొన్నావు?

పురు—నీవు నాకు పేర్లుచెప్పనక్కఱలేదు. నీకు తటస్థించిన యవమానమేమో చెప్పుము.

దామో—ఒకచిన్నదానిమీఁద నామనస్సు దృఢముగా తగిలినది. ఆచిన్నదాని కావలసినవారు నాప్రార్థన కామోదించి యాగ్రామమునకు రమ్మన్నారు. ఎంతో ప్రయాసపడి వచ్చినతరువాత వారిప్పుడాచిన్నదానిని మఱియొకరికియ్య నిశ్చయించు

కొన్నామని వర్తమానము పంపినారు. నేను దీని నవమానముగా తలఁచుచున్నాను.

పురు—ఇది తప్పక యవమానమే. లోకములో నింతకన్న మానవంతున కెక్కువ యవమాన మేముండును? దీనికి కారణము నీవేమని యూహించెదవు.

దామో—ఊహ యేందుకు? అది ప్రత్యక్షమే. దీనికంతకును కారణము విజయపాలుఁ డనువాఁడు. ఆ చిన్నది వానిని మోహించినదట! వాఁడిప్పుడే యూరనే యున్నాఁడట! ఈ యవమానమున కంతకును వాఁడే మూలమయి యుండవలెను. అందు కసందేహము లేదు.

పురు—నీకు ప్రతిపక్షుఁ డొకఁడు బైలుదేఱినాఁడా? ఏమి! చెప్పవు! అతఁ డక్రమమయిన మార్గము చేత నిన్ను తొలఁగఁద్రోసినాఁడేమో చెప్పఁగలవా?

దామో—ఆ విషయమయి యింత యాలోచన యేందుకు? అక్రమముగానే వాఁడు నన్ను నిరాకరించునట్లు చేసినాఁడు. క్రమమయిన మార్గముచేత నయిన పక్షమున వాఁడు నన్ను కదలింపఁ గలిగియుండునా?

పురు—నీ విఁకను చేయవలసినదేమో నీకు తెలియునా?

దామో—నాకు తెలియదు.

పురు—మనవద్ద నిప్పుడు కత్తులు లేవు. నామాటలు నీకర్థమయినవా?

దామో—ఏమి! నేను వానితో యుద్ధము చేయవలెనా?

పురు—అవును. చేయవలసినపని యదొక్కటే. అంతకంటె మఱేమియు లేదు.

దామో—వాఁడు నాకు కోపకారణ మేదియుఁ గలుగఁజేయలేదే!

పురు—అతఁడు గలుగఁజేసినంత కోపకారణము మఱియెవ్వరును నీకెప్పుడును గలుఁగఁజేసియుండరు. లోకములో నింతకంటె నధిక కోపకారణము మఱి యేముండును? ఒకఁడు కామించిన చిన్నదాని కడ్డము వచ్చి తాను గామింపఁ బూనుటకంటె మనుష్యుఁ డాతని విషయములో నెక్కువ యపరాధము చేయుట సాధ్యమగునా? అటువంటివాఁడు క్షమింపఁదగని గర్భశత్రువు. ఇది స్నేహధర్మమునకు మహావిరోధము.

దామో—స్నేహధర్మమునకు విరోధమా! స్నేహధర్మముండుటకు మొదట వానితో నాకు పరిచయమయినను లేదే! నేనీవఱకెన్నఁడును వానిని చూడనైనను చూడలేదు.

పురు—నీ వాతని మెఱుఁగకపోవుట యుద్ధము చేయరాదనుటకు హేతువుకాదు. తాను క్రొత్తవాఁడయినప్పుడు నీకతఁడు బొత్తిగానే ద్రోహము సేయఁ గూడదు.

దామో—అది నిజమే. అందుచేత నే నాకు వానిమీఁద మహాకోపము. తుపాకీ

కాల్చవలెనేమి? కత్తులుకూడ దూయవలెను కాఁబోలును! ఇట్లు పోరాడుటకు మిక్కిలి ధైర్యము కావలెను కాబోలును! అవునా? పెద్దమనుష్యునితో కయ్యము పెట్టుకొను టకు ముందుగా నాపక్షమున న్యాయమున్నదేమో చూడనక్కఱలేదా?

పురు—అవమానము సంభవించినప్పుడు న్యాయ మెవరికికావలెను? పూర్వము హిరణ్యకశిపుఁడును రావణాసురుఁడును విజయయాత్ర వెలువెడలినప్పుడు న్యాయ మాలోచించిరియే వెలువెడలినారనుకొన్నావా? లేదులేదు. వారు మహాశూరులయి యెదిరించినవారి తలలెల్ల కొబ్బరిపుచ్చెలలాగున ఖడ్గములతో నెగరవేసి న్యాయము నిమిత్తమయి మనసువచ్చినచోట మొఱపెట్టుకొండని పిఱికిపందలను వదలివేసినారు.

దామో—నీశూరవాక్యములు ప్రతాపోద్దీపకములుగా నున్నవి. నీవీరాలాపము వలన నామనస్సులోఁగూడ నొకవిధమయిన ధైర్యమువచ్చి ప్రవేశించుచున్నట్లున్నది. ఇదే వీరావేశము కాఁబోలును! తుపాకులతోను బాకులతోను తక్షణముకదలి వాని నిప్పుడే నాతో ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచెదను.

పురు—ఓదామోదరా! నాయొద్ద నిప్పుడు మావంశవృక్షమున్న పక్షమున మాపూ ర్వులనందఱిని నీకొక్కొక్కరి నేవరుసగా పేరుపేరువరుసను జూపియుందును. శూరా గ్రేసరులయిన మాపెద్దలలో నొక్కఁడు శత్రువునైనను తన ఖడ్గధారతో తలఁదఱుగక విడువఁ డొక్కఁడును లేఁడుసుమా! వంశక్రమాగతమయిన క్షాత్రమును మాత్రము మన మెన్నఁ డును విడువరాదు.

దామో—ఓపురుషోత్తమదేవా! మీపూర్వులవలెనే మాపూర్వులును మహాపరా క్రమశాలులే. మూలపురుషుఁడు మొదలుకొని నాతండ్రివరకు మాపెద్దలందఱును యోధాను యోధులే. వారిలో నొకఁడు సేనాధిపత్యము చేసెనఁట! ఆవార్తయట్లుండ నిమ్ము. ఇప్పటి నీప్రతాపాగ్నివలన నామనస్సులో శత్రువుమీఁదఁగల దయారసమంతయు నింకిపోయినది. నేను నిజముగా రణశూరుఁడనయినాను. నాశరీరము పరవశమగు చున్నది.

పురు—కోపము తెచ్చుకొని వేగిరపడకు. ఇటువంటి కార్యములలో తొందర పాటెంతమాత్రమును గూడదు. ఇట్టిఘనకార్యములను సదాశాంతతతో చేయవలెను.

దామో—నేను కోపము తెచ్చుకోవలెను. నేను వీరావేశము పొందవలెను. అభిమానము నిలుపుకొనఁదలఁచుకొన్నపక్షమున, నీవు నాకోపాగ్ని నిప్పుడుచల్లారు నట్లు చేయకు. ఇదిగో కాగితమును కలమును. (అని వ్రాయుటకుఁ గూరుచుండి) ఇది యెఱ్ఱసిరాయైన బాగుండును! అప్పుడు నాకంటికి నాపోటువలన నెత్తురువర దలు కట్టుచున్నట్లు కానఁబడును, నాయక్షరములు చూచి పగవాఁడు భయపడు

నట్లుగా నుత్తరము వ్రాయవలెను. పద్దతులరయములతో వ్రాయుదునా? ఏమారంభించవలెనో చెప్పు. ప్రతిపదములో వీరరస మొలుకుచుండవలెను.

పురు—నీయుత్తరము నీవే యాలోచించుకొని యారంభించు.

దామో—నాప్రాణము గొనుటకయి శపథములతో నారంభింతునా? ఓ నిర్భాగ్యుఁడా!' అని మొదలు పెట్టదునా?

పురు—అట్లు చేయఁగూడదు. మనమెక్కుటివానికి గౌరవము జూపుము. మనము పెద్దమనుష్యులమని తోఁచునట్లుగా వ్రాయవలెను. "అయ్యా!"—అని మొదలు పెట్టు.

దామో—నన్ను రమాపతి చినవాని కంత గౌరవము చేయుదునా? మంచిది! అలాగు ననే వ్రాసెదను. వాని నే పెద్దవానిని గానిమ్ము

పురు—"మనమిద్దఱమును నేకసుందరి నిమిత్తమే—"

దామో—అవల. ఏకసుందరినిమిత్త మన్నమాట దివ్యముగానున్నది.

పురు—"ప్రయత్నము చేయుచున్నందువలన సంభవింపఁబోయెడి యుపద్రవమును ముందుగానే తొలఁగించుకొనుటకయి—"

దామో—ఉపద్రవమునా? అవును. అది మంచిమాటే తరువాత.

పురు—"నీవు దయచేసి—"

దామో—దయచేయుమని ప్రార్థించుటకయి నేను వానిని నాయింటికి విందుకుఁ బిలుతునా? ఆమాట సరిగాలేదు.

పురు—తొందరపడఁబోకు. చెప్పినట్లు వ్రాయుము.

దామో—మంచిది వ్రాసెదను. "నీవు దయచేసి" అయినది. అటుతరువాత?

పురు—"ద్వంద్వయుద్ధము చేసి మనలో మనమే యుద్ధముఖమున మనవివాదము పరిష్కరించుకొనుటకయి—"

దామో—ఇది సరి.

పురు—ఇఁక స్థలనిర్ణయము చేయవలెను. ఈపనికి జనోద్యానవన మనుకూలముగా నుండవచ్చును.—"ఊరిబయిలనున్న జనోద్యానవనములోనున్న కలిసికొనవలెను."

దామో—చాలును. ఈయుత్తరము మడిచి పయిని లక్కతో ఖడ్గముద్ర వేసి యిప్పుడే పంపెదను.

పురు—చూచినావా? ఈచిన్న యుత్తరముకలన నీలో మీకు సంభవింపఁబోయెడి పెద్దయుపద్రవ మొక్కదెబ్బను తప్పిపోవచ్చును

దామో—ఉపద్రవము తొలఁగిపోవుటకే కాదా యిద్వంద్వయుద్ధము!

పురు—ఇఁక కాలనిర్ణయము నీమనసువచ్చినది. నీవు చేసికొనవచ్చును. సూర్యా

చున యడిదితివా శుభస్యశీఘ్రమ్మని యుండుటచేత నే నీసాయంకాలమే ముహూర్తము పెట్టెదను. ఇది యెంతశీఘ్రముగానయిన నంతమంచిది. యీరాత్రియే సర్వము నివారణ మయినపక్షమున రేపు నిర్విచారముగా నుండవచ్చును.

దామో—అవును. నీవన్న మాట నిజమే.

పురు—నీవీలోపల నాకవ్రాసినంగాని సాయంకాలములోపల నేను నిన్ను మరలఁజూడను. నీశుభలేఖను నేనే కొనిపోయి నాహస్తముతోనే యాతనికిచ్చెదను. నీతో నేనొక్కరహస్యము చెప్పుచున్నాను. నీవు నిర్వహింపవలసిన కార్యభారము వంటిదే యొకటి యిప్పుడు నాభుజములమీఁదఁగూడ నిలిచియున్నది. వీరుఁడయిన యొకానొకయౌవన పురుషుఁడు కొంతకాలమునుండి నాపౌరుషమును చులకనచేసి నన్ను గేలిచేయుచున్నాఁడు. అతనిని యుద్ధమునకుఁ బిలుచుటకయి యేదో యొక మిషపన్ని కలహము పెట్టుకొనవలెను.

దామో—అట్లయినపక్షమున నీవు ముందుగా యుద్ధముచేయఁగా నాకుచూడ వలెననియున్నది. నీవతనిని జంపుచుండఁగాఁ జూచి యుద్ధమేలాగునఁ జేయవలెనో నేనింకను గొంచెము నేర్చుకోవలసియున్నది.

పురు—నీకస్త్రవిద్యాగురువునగుట నాకును గౌరవమే. ఇప్పటికిని నేను సెలవు పుచ్చుకొనెదను.—నీశత్రువు తారసించినప్పుడు నీవెంతమాత్రమును వేగిరపడక సర్వమును శాంతతతోను నేర్పుతోను నిర్వహింపవలెను. నీమాటలెంత మృదువుగానున్నను నీకత్తివలెనే నీచేవ్రేళ్లు మాత్రము వాఁడిగా నుండవలెనుజుమా!

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)



# చతుర్థాంకము.

౧. రంగము—దామోదరశర్మ గృహము.

[దామోదరశర్మయు, మాధవుఁడును ప్రవేశించుచున్నారు.

మాధ—దేవుడితోడు! నేను యెప్పుడూ అటువంటిపని చెయ్యను. నాకు యిష్టం లేనప్పుడు పెళ్ళిచెయ్యమంది పురుషోత్తమ దేవుళ్లుచేసినా నాచేత పోట్లాడించలేరు. ఈసంగతి వింటే మామ్మగారావిడె యేమంటుంది?

దామో—ఓమాధవా! ఏమనుకొన్నావు? పురుషోత్తమదేవుని మాటలువిన్న

పక్షమున నీకుఁగూడ నెక్కడలేని శౌర్యమును పుట్టించగలను. అతనిమాటలలో నుండి నిప్పులు కురిసినవి.

మాధ—నాకు శౌర్యం పుట్టించడానికి అతనిచేతగాదు. అటువంటి భజాకోరుల మాటలంటేనే నాకు తలనొప్పి. మీరు పోట్లాడవలెనని వుంటే మాత్రం నేను వద్దనిచెప్పను. నేనుమాత్రము మీపోట్లాటలో కాలుపెట్టను.

దామో—మాధవా! నాగౌరవమునకు భంగమువచ్చును. నాగౌరవమును మాత్రమెట్లయినఁ గాపాడుకొనవలెను.

మాధ—నాగౌరవం నేనూ కాపాడుకోవలెను. మొట్టమొదటనన్ను నేను కాపాడుకుంటేనేగాని నాగౌరవం నిలువదు.

దామో—తగు మనుష్యుఁడెవ్వఁడును తనగౌరవమును పోఁగొట్టుకొనుట కిష్టపడఁడు.

మాధ—తగుమనిషి యెప్పుడూ గౌరవాన్ని పోఁగొట్టుకోవడానికి యిష్టపడక పోయినట్టయితే తగుమనిషిని పోగొట్టుకోవడానికి గౌరవంకూడా యిష్టపడకుండా వుండవలెను. అలా చెయ్యకపోయినట్టయితే గౌరవం తాను స్నేహితుడివలె నటించి మిత్రద్రోహం చేసినదవుతుంది. తగుమనిషినని నన్ను యెవరూ అనకపోయినా లోకంలో నాకంటె తగుమనిషి యెవరూలేరు. నాగౌరవము నన్ను ఖూరి వకపెద్దమనిషితో పోట్లాడుమని బోధిస్తుంది. దాని బోధప్రకారం నేను పోట్లాడుతాను. ఆపోట్లాటలో నేను గెలిచి నాశత్రువును చంపినట్టయితే, అప్పుడాలాభం యెవరికి వస్తుంది? నాగౌరవానికి వస్తుంది. ఒకవేళ నేనే వోడిపోయి నాశత్రువే నన్ను చంపినట్టయితే, అప్పుడు నాగౌరవం నన్ను నేలపాలుచేసి విడిచిపెట్టి నాశత్రువు వద్దకు పరుగెత్తుతుంది.

దామో—మాధవా! నీవాలాగన వనరాదు. అట్టి సమయములో నీశరీరము పోయినను భూమిమీఁద శాశ్వతముగా నీపేరు నిలుచును. నీవు స్వర్గమునకు పోయినను నీగౌరవమక్కడకే నీవెంటవచ్చును.

మాధ—అట్టిగౌరవం నాకక్కరలేదు. నన్ను స్వర్గానికిపంపి నావెంటబడే గౌరవాన్ని నేను యెప్పుడూకోరను.

దామో—నీవు వట్టి పిరికిపందవు. నాకుఁగల పౌరుషమునకు నీమాటలువినుట సహిత మనర్హము. నీమాటలువిని పూర్వుల పౌరుషమునకుఁగూడ నేను భంగము తెత్తునా? భీరుత్వము చూపుట మా పెద్దలకెంత యవమానకరమో యాలోచింపుము.

మాధ—వారి కెంత అవమానకరంగా వుండేటట్టయితే నాలుగు కత్తిపోట్లూ

విక్ర—నాకొఱకై మాత్రమున క్రమము లేదు. ఈనాఁటి నీవు మఱియెవరివద్దను తెలి ప్పఁబోకు. నామాటవినుము. నేను నీపని శ్రీమహాగారి కెఱింగింతును.

దామో—నామీఁద నీకనుగ్రహమున్నదిగనుక, స్నేహధర్మమును గావించెదవా! విక్రమసేనా! నీవు నాకు సహాయుఁడవుగా నుండఁగలవా?

విక్ర—ఈవ్యవహారములో మాత్రము నేనుపయోగపడఁగూడదు. ఇందులో నేనుండుట యుక్తమయిన పనికాదు.

దామో—అట్లయినపక్షమున నేను నామిత్రుఁడయిన పురుషోత్తమదేవునినే కోరవలెను. అయినను నీవు నాక్షేమమునయినను కోరుచుండవలెను.

విక్ర—అతఁడును నీవును కలిసికొన్నప్పుడు మఱియెవ్వరి క్షేమమును గోరను. నామాట వినుము.

[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సేవ—వీరసేనుఁడుగారు కిందికివచ్చి యిక్కడ విక్రమసేనుఁడు వున్నాఁడేమో కనుక్కొని రమ్మన్నారు.

విక్ర—ఇదిగో వచ్చుచున్నానని చెప్పు.

సేవ—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

విక్ర—(తనలో) ఓరణశూరా! నీకు జయము కలుగునుగాక!

దామో—విక్రమసేనా! నిలువు. ఒక్కనిమిషము తాళు. నీస్నేహితుఁడైన నా మోచరవర్మ యెటువంటివాఁడని విజయపాలుఁడు నిన్నడిగిన పక్షమున, అతఁడు ప్రత్యక్షరాక్షసుఁడని చెప్పవచ్చును. అలాగునే చెప్పెదవు కాదా?

విక్ర—నిశ్చయముగా చెప్పెదను. ముక్కుకొండలు కొట్టెడు మహావ్యాఘ్రమని చెప్పెదను.

దామో—అలాగు చెప్పు. ఆమాటలతోనే యతఁడు భయపడిన పక్షమున, అతఁడు యుద్ధమునకే రాకపోవచ్చును. నేను శత్రువును వారము దినములు బాధపెట్టి మఱి చంపుదునని చెప్పు. మఱచిపోకుమా!

విక్ర—మఱచిపోను. నాటిన నిన్నందఱు నసహాయశూరుఁడని చెప్పుకొందురని చెప్పెదను.

దామో—ఈపేరు సరి. ఇదియంతయు ప్రాణాపాయము కలుగకుండుటకయి చెప్పినదేకాని మఱియొకటికాదు. నాగౌరవము నిలుపుకోఁగలిగినపక్షమున, అతని ప్రాణముల కలుగుట నాయిష్టముకాదు.

విక్ర—కాదు. నీవు మహాదయార్ద్రహృదయుఁడవు.

దామో—అతనిని నేను చంపవలెనని నీకోరిక కాదుగదా!

విక్ర—కాదుకాదు. అయినను నీవు ప్రత్యక్షరాక్షసుఁడవు. అవునా? (అని పోఁబోవుచున్నాఁడు.)

దామో—అవునవును. విక్రమసేనా! ఇంకొక్క క్షణకాలమాగు. నీవరిగిన తరువాత నాకింకయాగ్రహ మెన్నఁడును రాలేదని చెప్పు. కంటఁబడఁగా నేమ్రింగి వేయు నంతకోపము వచ్చినదని చెప్పు.

విక్ర—తప్పక చెప్పెదను.

దామో—ముక్కుకండలు కొటికదు పెద్దపులియన్న మాట మఱచి పోయెదవు సుమా!

విక్ర—మఱవిపోను. నీవసహాయశూరుఁడవనికూడ చెప్పెదను.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

౨ రంగము—సుభద్రమ్మగారియిల్లు.

[సుభద్రమ్మయు, కళావతియు ప్రవేశించుచున్నారు.]

సుభ—ఓమూర్ఖురాలా! అతని విషయమయి నీకుఁగల యాక్షేపణమేమో నాకు చెప్పు. అతఁడు సౌందర్యవంతుఁడు కాఁడా?—ఏమి? మాటాడవేమి?—అతఁడు రసికవరేణ్యుఁడు కాఁడా? పురుషాగ్రణ్యుఁడు కాఁడా?

కళా—(తనలో) ఈమె తానిప్పుడెవరిని స్తుతించుచున్నదో కొంచెమయిన తెలియఁగదు. (బిగ్గరగా) అత్తా! విజయపాలుఁడు వట్టివాఁడే.

సుభ—పోలికలు చెప్ప రాదు. ఒకరితో నొకరిని పోల్చుట పడుచుదానికెప్పుడును కూడనిపని. విక్రమసేనుఁడు నిశ్చయముగా రసికాగ్ర గణ్యుఁడు.

కళా—(తనలో) నీవు చూచిన విక్రమసేనుఁడు కాఁబోలును!

సుభ—అతఁడు మంచి గురుజనశిక్షలో పెరిగినవాఁడు. అతని వినయమేమిటి? వాక్చాతుర్యమేమి? రూపరేఖావిలాసములేమి? మొట్టమొదట నేనతని ముఖమును జూడఁగానే ప్రబంధములలో వర్ణింపఁబడెడు మన్మథుఁడు నాకప్పుడు స్మరణకువచ్చినాఁడు.

కళా—(తనలో) క్షణకాలములో తానుపడిన భ్రాంతిని కనుఁగొన్న తరువాత నీమె యిప్పుడెంత కోపపడునో!

[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సేవ—అమ్మా! వీరసేనుఁడుగారును విక్రమసేనుఁడుగారును వచ్చి క్రిందనిలిచియున్నారు.

సుభ — పైకెక్కడకురమ్మను.

సేన — చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

సుభ — కళావతీ! నీవిప్పుడు బుద్ధిమంతురాలయిన కన్యకు తగినట్టుగా నడుచుకొనవలెను. పెద్దలయెడలఁ జూపవలసిన విధేయతను మఱచిపోయినను నీవధమపక్షము పెద్దలతోఁ పెరిఁగినదాన వయినట్టయినను మంచిమర్యాద చూపవలెను.

కళా — అత్తా! నామనోనిశ్చయ మేమో చేసినదానికే నేఁ దెలిపియున్నాను. అతనికి నేనిప్పుడాశ చూపి ప్రోత్సాహవాక్యములు పలుకక పోవుటయేకాక యతనితో నేనిప్పుడు నోరువిప్పి మాటాడనైనను మాటాడను; అతనివంక చూడనైననూ చూడను. (అని మొగము త్రిప్పుకొని తలవంచుకొని కూరుచున్నది.)

[వీరసేనుఁడును విక్రమసేనుఁడును ప్రవేశించుచున్నారు.]

వీర — సుభద్రమ్మా! ఇదిగో మేము వచ్చినాము. నీవిటువచ్చి నిర్దయురాలయిన యీసుందరియొక్క కోపదృష్టిని కొంత శాంతిపఱుచు. వీనినిమనమార్గమునకు తెచ్చుటకు నేనెంతో కష్టపడినాను. వీనిలోపల నేమున్నదో నాకు తెలియదు. నేనునిర్బంధము నుపయోగపఱచక పోయినట్లయిన, వీఁడును తప్పించుకొని జాఱిపోయెడివాఁడే.

సుభ — వీరసేనా! మీరీవ్యవహారములో నపరిమితమయిన శ్రమపడినారు. మీకు వృథాశ్రమ కలుగఁజేసినందుకు నాకు సిగ్గగుచున్నది. (కళావతితో మెల్లఁగా) కళావతీ! కళావతీ! నిన్ను బతిమాలుకొనుచున్నాను. లేలే. తలయెత్తిచూచి వీరిని గారవించు.

వీర — సుభద్రమ్మా! వీనియొక్క యోగ్యతను గూర్చియు మేనత్త కుదిర్చిన సంబంధమువలనఁ జూపవలసిన గణ్యతనుగూర్చియు నాతోడి బంధుత్వ గౌరవమును గూర్చియు కళావతి తనలో తాను చక్కఁగా నాలోచించుకొన్నదనినమ్ముచున్నాను. (విక్రమసేనునితో మెల్లఁగా) విక్రమా! ఆచిన్నదానిని పలుకరించి మాటాడు.

విక్ర — (తనలో) ఓయి దేవుఁడా! నాకిప్పుడేమి చేయుటకును తోఁచకున్నది. (వీరసేనునితో రహస్యముగా) అయ్యా! మీరును చూచుచున్నారుగదా! ఆచిన్నది మీయెదుట నామొగము వంకచూడనైనను చూడకున్నది. ఆచిన్నది నన్ను కన్నెత్తి చూడదని యెఱిఁగినవాఁడనయి తమతో ముందుగానే మనవిచేసియున్నాను. మీరు దయచేసి నన్నిప్పుడింటికిఁగా విడువవలెనని నాప్రార్థన. (అని బతిమాలుకొనుచున్నాఁడు.)

కళా — (తనలో) నామేనత్త యొత్తుడుచేతనో యింకను తన యుద్యుక్తమును

కోలుపకున్నది! ఈమె యితనిముఖము నింకను నిశ్చయముగాఁ జూచి యుండలేదు. ఏ వేళ నుద్యోగస్థులందఱును నొక్కపోలికగానే యుందురు కాఁబోలును! లేదా, ఈమె దృష్టిలో నేమయిన లోపమున్నదేమో!

వీర—ఇప్పుడప్పుడే మిమ్మొంటిగా విడిచి నేనణుగుదూరమైనను పోను.

సుభ—వీరసేనా! నా మేనకోడలు నామాటయందంత గౌరవముంచునది కాదని చెప్పవలసినందుకు చింతిల్లుచున్నాను.—(కళావతితో మెల్లఁగా) కళావతీ! ఈవైపు తిరుగు. నీమౌర్ఖ్యముచూచి నేను లజ్జపడుచున్నాను.

వీర—కళావతి నాకుమారుని నభిలషింపనొల్లకుండుటకు కానుపించు కారణమేదో తెలిసికొను భాగ్యము నాకు లభించును గాక!—(విక్రమసేనునితో మెల్లఁగా) విక్రమా! ఆరంభింపవేమి? ఓరి గాడిదా! మాటాడు.

సుభ—వీరసేనా! కారణమారోపించుట దీనికి సాధ్యముకాదు. కారణమున్నదని కళావతి చెప్పదు.—(కళావతితో రహస్యముగా) ఓముద్దరాలా! అడిగిన దాని కుత్తరము చెప్పు. సదుత్తరము చెప్పవేమి?

వీర—సుభద్రమ్మా! కారణము లేని యీచిన్నతనపు వెఱ్ఱిపాటువలన మావిక్రముని సౌఖ్యమునకు భంగము కలుగదని నేను నమ్ముచున్నాను.—(విక్రమసేనునితో రహస్యముగా) ఓరి మొద్దా! మాటాడవేమి?

కళా—(తనలో) మాటాడుటకు నాకెంత యిష్టమున్నదో నాకామనసునం దంతే యిష్టమున్నట్టు కనఁబడుచున్నది.—నామేనత్త యెంతగుడ్డిదిగానున్నదో!

విక్ర—ఓ-ఓ-కన్యా! ఓ-(మాటాడవలెనని ప్రయత్నించి, వీరసేనుని వంకఁ దిరిగి) నేను తొందరపడుచున్నాను. నాకు తత్తఱపాటు కలుగుచున్నది. ఇట్లు సంభవించునని నేనీవఱకే యెఱుఁగుదును. నేను ముందుగానే తమతో మనవి చేసినాను. నాకుఁగల మోహాతిశయము నాహృదయస్థైర్యమును పోఁగొట్టుచున్నది.

వీర—అది నీహృదయస్థైర్యమును పోఁగొట్టినదికాని నీనోటిమాటను పోఁగొట్టలేదుగదా! ఓరి బుద్ధిహీనుఁడా! ముందుకుపోయి యాచిన్నదానితో తిన్నఁగా మాటాడు.

విక్ర—ఆచిన్నదానితోనా? (తమ్ము విడిచి పొమ్మని సుభద్రమ్మకు సైగచేయుచున్నాఁడు!)

సుభ—వీరసేనా! ఇక్కడ వీరినిద్దఱిని విడిచి కొంచెముసేపు మనమావలికి బోదమా?—(కళావతితో మెల్లఁగా) ఓసీ మొండి నిర్భాగ్యురాలా!

వీర — ఇప్పుడప్పుడే కాదు. — (విక్రమసేనునితో మెల్లఁగా) నీవు దయ్యముసోఁకినదానవేమి? నీ నోటితాళము విప్పు.

విక్ర — (తనలో) ఈశ్వరానుగ్రహమువలన కళావతి నావంక తిరిగి చూడక కోపముతో మూతిముడుచుకొని యుండును గాక! నేను మాఱుగొంతుకతో మాటాడవలెను. (కళావతి చేరువకుఁబోయి హీనస్వరముతో) కామపీడితమైన యీసుస్వరము కళావతి యొక్కసారి చెవియొగ్గి విన ననుగ్రహింపదా?

వీర — దయ్యము పట్టుకొని నీగొంతు నొక్కుచున్నదా యేమి? నోరు తెఱచి స్పష్టముగా మాటాడవేమి? గొంతులో గోదురుకప్పలాగున మూలుగుచు నిలుచఁబడకు.

విక్ర — నా-నా-నాకా మోహోద్రేకమువలనను, నా-నా-నాసిగ్గువలనను, నా-నా-నా నోటినుండి మాట పయికి రాకున్నది.

వీర — ఓహోహో! పోయినసిగ్గు నీకుమరల వచ్చినదే! విక్రమా! నామాటవినుము. నీవువెంటనే తిన్నఁగా స్పష్టముగా బిగ్గరగా మాటాడనిపక్షమున, నాకు కోపమాగదు సుమా! — ఓసుభద్రమ్మా! ఇంతటితో తననేలచూపులు మాని నీచేనకోడలి నొక్కసారి మాయందనుగ్రహించి యీవంక తిరుగుమను.

సుభ — కళావతీ! ఇటుతిరుగు. (అని మందలించుచున్నది.)

విక్ర — (తనలో) ఇఁక సర్వము బయలఁబడకమానదు. — (కళావతి చెంతకుఁబోయి. మెల్లఁగా) ఓప్రియురాలా! కళావతీ! వింతపడఁబోకు. కొంచెముసేపు నీయద్భుతమును నీమనస్సులోనే యణఁచుకో.

కళా — (తనలో) ఓయీశ్వరుఁడా! ఈకంఠస్వరము విజయపాలునిదే. ఇతఁడు నిశ్చయముగా వీరసేనునిఁగూడ మోసపుచ్చియుండనేరఁడుగదా! (అని మెల్లఁగా కన్నులువిచ్చి చుట్టుఁజూచి యులికిపడి) ఆహా! ఏమి నాకన్నుల కింతభాగ్యము పట్టునా? ఓవిజయపాలా! విజయపాలా! ఇది స్వప్నమా? సత్యమా? ఏమి యీయాశ్చర్యము!

విక్ర — (తనలో) అక్కటా! అంతయు మునిగిపోయినది.

వీర — విజయపాలుఁడా? ఎక్కడి విజయపాలుఁడు? ఈచిన్నదానికి మతిభ్రమ కప్పినదాయేమి? వీఁడు నాకొడుకు విక్రముఁడు.

సుభ — ఇది సిగ్గులచేటు. పట్టిసిగ్గులచేటు. ఓసి వివేకహీనులారా! నీమనస్సెప్పుడును విజయపాలునిమీఁదనే యుండుటచేత నీకన్నులకెప్పుడును సర్వమును విజయపాలమయముగానే కనఁబడుచున్నది. విక్రమసేనునికి [illegible] చేసికో.

కళా — ఇక్కడ రాజ్యేశ్వరుఁడైన విజయపాలుఁడుదక్క నాకింటికి విక్రమ

యును నన్ను విడిచిపెట్టకుము, తక్కినవానిని నేనపేక్షింపను. (తనలో) నేనిప్పుడు కొంచెము బెట్టుచేసి చూచెదను.

కళా—(లేచుచు) నామనస్సులోనున్నది స్పష్టముగాఁ జెప్పెదను వినుము. నీవు నీకార్యమును నీచమగు పౌరుషహీనమయిన వంచనచేత సాధించుకొన్నావు. అందుచేత మోసము చేసిన శిక్షకు నీవర్హుఁడవు. నాహృదయదౌర్బల్యమును కనిపెట్టి నన్ను నీవు పిల్లదానినాడించిన ట్లాడించుచున్నావు. నీలోనీవు నన్నుఁజూచి నవ్వుచు నీవు పొందిన విజయమునకు సంతోషించుచున్నావు కాఁబోలును!

విక్ర—కళావతీ! లేనిదోష మారోపించి యిప్పుడు నీవు నాయెడ నపచారము చేయుచున్నావు. నేను చెప్పునది శాంతముగా విని—

కళా—నాబంధువులను వంచించి మాయ చేయుచున్నావను భ్రమలోనుండి, వారందఱి కన్నులుగప్పి తప్పించుకొని పాఱిపోయి వారికి కోపము తెప్పించి నాసామర్థ్యము చూపవలెనని నేను కొండంతయాశ పెట్టుకొనియుంటిని. అట్లుండఁగా నామేనత్త యొక్క యంగీకారమువలనను సమాధానమువలనను నాయాశయంతయు నిమిషములో భగ్నమయిపోయినది. వారిని మోసపుచ్చుటకు మాఱుగా తుదకిప్పుడు నేనొక్కతెనే మోసపోయినదాననయినాను. (అని కోపోద్రేకముతో నడుచుచు) ఇదిగో పటము— విజయపాలుని పటము. (పటమును అఱికెలోనుండి పయికిఁదీసి) నన్నెందఱెన్ని విధముల భయపెట్టుచున్నను దూషించుచున్నను లక్ష్యము చేయక యీచిత్రపటమును నేనింతకాలము రేయింబగళ్లు హృదయమధ్యమున ధరించినాను. నీపటమిఁక నీవే పుచ్చుకొమ్ము. (అని మీఁద విసరివైచి) ఈప్రతిరూపమును నా హృదయమునుండి యెంత యనాయాసముగాఁ దీసివేయుచున్నానో యంతయనాయాసముగానే దీనికిమూలమైన పురుషునిగూడ నేను నాహృదయములోనుండి తఱిమివేయఁగలుగుదునని నీవు నిశ్చయముగా నమ్ముము.

విక్ర—ఓకాంతా! ఈవిషయములో నీకును నాకును భేదములేదు. ఇదిగో కళావతియొక్క పటము. (అని పయికిఁదీసి) ఈప్రతిరూపమునకును నిజరూపమునకును నాకెంత వ్యత్యాసము కనఁబడుచున్నది! ఈదివ్యసుందర విగ్రహముయొక్క కలకలలాడుచున్న యీనవ్వు మొగమేకదా! మొట్టమొదట నన్నాశలపెట్టి నాహృదయము నపారసౌఖ్యానందసుధారాశిలో ముంచినది! ఎన్నఁడును తుడిచి వేయుటకసాధ్యమగునట్లుగా కామదేవుని పుస్తకములో శిలాక్షరములతో వ్రాయఁబడియున్న శపథములను బలికిన నీచిన్నపెదవులేకదా! అవియన్నియు పూర్వపు గాథలయిపోయినవి. అంతయు నిప్పుడు మరల మొట్టమొదటికి వచ్చినది. ఓసుందరీ! నీనిరుపమాన

ఈకన్యను ముందర నీప్రతిబింబ మంతచక్కనిదిగా నుండకపోయినను, నామనస్సు నకు మాత్రము దీని మనోహరత్వమును దీనియందలి గౌరవమును దీని నిజరూపమున కంటె తక్కువ పడలేదు గాన దీనిని చేపట్టఁబూనఁజాలను. (అని మరల హృదయమున ధరించుచున్నాఁడు.)

కళా—(క్రోధశాంతతతో) ఇదియంతయు నీదోషమే. స్వయంకృతాపరాధ మును దెలిసికొని నీవు తృప్తుఁడవయి యుండవచ్చును.

విక్ర—నిశ్చయముగా తృప్తుఁడనయినాను. ఇంతకంటె నీవు మొట్టమొదట నే ప్రేమమాపి యూరకపెట్టుకొన్న చెంతో బాగుండును. ఆహాహా! ఇది యెంతయయినను సరసముగానున్నది. నూఱులకొలఁది బాసలుచేసి వానినెల్ల తప్పుట నీదృష్టికిగొప్పగా కనఁబడు మంతలేదు. ఆ వాగ్దానములెల్లను నీదృష్టికి తృణప్రాయములయినవి. అయి నను లోకులుమాత్రము కళావతి తన హృదయమునే తాఁ నెఱుఁగదని చెప్పకొనక మానరు. ఇతరులమాటలతో నీకేమిపని? లోకులెల్లవేళ తమ దుస్స్వభావముచేత ప్రియుఁడు ప్రియురాలియొక్క యాదరముఁజూచి మొగము మొత్తిపడి పోయినాఁడని వాడ వేసినను వేయవచ్చును. ఆయపవాదము సహితము నీమనస్సున కాయసము తోఁపింపకుండును గాక!

కళా.--ఈయవమానమును సహింపఁజాలను. (అని కన్నీరు పెట్టుకొనుచున్నది.)

[అంతట సుభద్రమ్మయు, వీరసేనుఁడును ప్రవేశించుచున్నారు]

సుభ—బావా! రమ్ము. మనము కొంచెము సేపు వీరికామోన్మాదమునకును శృంగార ప్రలాపములకును విఘ్నము కలుగఁజేయవలెను.

కళా—ఓ నీచకృతఘ్నుఁడా! ఇది నీద్రోహమును వంచనమును విందియున్నది!
(అని పెద్దపెట్టున నేడ్చుచున్నది.)

వీర—ఇదేమి వైపరీత్యము? ఇది చూడఁగా నాకత్యద్భుతముగనున్నది. సుభ ద్రమ్మా! ఇటువంటి కామోన్మాదమును శృంగారప్రలాపములును నేనీవఱకెక్కడను వినియైన కనియైన నుండలేదు. ఈపరిహాసమున కర్థమేమి? నాకు తెలియకున్నది.

విక్ర—ఈచిన్నదాని నడుగుండి.

సుభ—ఓయి దేవుఁడా! నామట్టుకు నాకత్యాశ్చర్యకరముగానున్నది. అమ్మా! కళావతీ! దీనికి కారణమేమి?

కళా—ఈయననడుగు.

వీర—నాకు కోపావేశముతో దేహము వణఁకుచున్నది. ఓరీ! విక్రమా!

నీవిలోపల నీవంతు చేసిన దేవపూజలు గాక క్రొత్తవేషము వేసి మాటిపోలేదుగదా? నిజము చెప్పు.

సుభ—అబ్బాయీ! ఇప్పుడు నాకేమియు మాయలేదుగదా? నీవు రావణా సురునివలె నిమిషములో మతిలేనిక మాయారూపమును ధరించినావేమో చెప్పు.

విక్ర—చెప్పుమని నన్ను నిర్బంధపెట్టకుండి. ఆవిషయమును యీదిన్నదే నా కంటె చక్కఁగా చెప్పఁగలదు.

కళా—వెనుక నొకసారి యిఁక విజయపాలుని నెప్పుడును దలఁచుకోవలదని నీవు నాకాజ్ఞయిచ్చినావు. ఆవిజయపాలుఁడిప్పు డిక్కడ నీయెదుట నేయున్నాఁడు. అప్పటి నీయాజ్ఞకు నేనిప్పుడు లోఁబడుచున్నాను. ఈవిషయము మొదలుకొని నీవు చెప్పినట్లు నేనీతని పేరు తలపెట్టకయుండు చున్నాను. (అని లేచిపోవుచున్నది.)

సుభ—ఓయి భగవంతుఁడా! ఇది పెద్దయింద్రజాలముగ నున్నది! ఇప్పుడు పశు స్తనము తాఁబులైపోయినదే? ఓయీ! విక్రమసేనా! నీవు విరసోక్తులాడి నా మేనకోడలి మనస్సు నొప్పించలేదుగదా?

వీర—సత్యమిప్పుడు బయటఁబడినది. ఆ—హా—హా—హా! విక్రమా! కోపావేశము చేత పరవశుఁడవయి నీవాచిన్నదానిమనసు నొచ్చునట్లుగా నేదో గర్వోక్తులు పలికినావు.

విక్ర—లేదు. తమ పాదములతోడు—

సుభ—చీచీ! విక్రమసేనా! నీవేమోయన్నావు.

విక్ర—అమ్మా! నీతోడు—

వీర—ఓరి దొంగా! నీమాట నేను నమ్మను. మాటాడకు. తన చిన్నతనములో నీతండ్రియు నిట్లే చేసినవాఁడు సుమీ. ఈవేగిరపాటును కోపమును మనక్షత్రియ కులములో ముఖ్యముగా పౌరుషభూషితమైన మనవంశములోను మొదటినుండియు పరంపరగా వచ్చుచున్నవే. అ హా హా! పాపము! ఎందుకు నీవాచిన్నదానిని నిష్కారణముగా చెనకఁగొట్టినావురా?

విక్ర—ఈశ్వరసాక్షికముగా—

వీర—నీమాట నేను వినను. నీప్రసంగము కట్టిపెట్టు. సుభద్రమ్మ మిమ్మిద్దఱిని సమాధానపఱుచును— ఓ సుభద్రమ్మా! నీవాచిన్నదానిని సమాధానపఱిచి వీని మీఁది కోపము పోఁగొట్టవలెను. వీని స్వభావమే యిట్టిదని నీవు మిక్కిలిశాంతితో చెప్పు. ఈపౌరుషము మాకుటుంబములో నంతటికిని సహజగుణమేయనికూడ చెప్పు:— అహాహాహా! విక్రమా! మనము పోదమురా.—సుభద్రమ్మా! వీఁడు పొత్తిగా దూరా

కోపవశుని దౌర్భాగ్యుఁడు. (అని విక్రమసేనుని లాగుకొని పోవుచున్నాఁడు.)

సుధ—వీరసేనా! మీరు నాతో నింతగాఁ జెప్పవలసిన పనిలేదు—విక్రమ సేనానీ విచారపడఁబోకు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



3. రంగము—ఉత్తరపువీధి

[పురుషోత్తమదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

పురు—విక్రమసేనుఁడెక్కడనడఁగిపోయినాఁడో తెలియకున్నది. ఈయుద్యోగస్థు లెప్పుడును స్త్రీలవ్యవహారములతో నితరులకడ్డము వచ్చుచునేయుందురు. నేను పూర్వమీలాగుననే వసుమతిని వివాహము చేసికొనుటకు మాటలు జరుపుచుండఁగా, ఇంతలో వసుమ నెక్కడనుండియో యొకయుద్యోగస్థుఁ డాకస్మికముగా వచ్చి యాచిన్నదానిని నాకంటఁబడనీక యెగరెత్తుకొనిపోయి తానువివాహముచేసికొన్నాఁడు. యౌవనవంతులైన కన్యలను తమవలలో వేసికొనుట కీయుద్యోగస్థులవద్ద నేమి మంత్రములున్నవో! వారి రౌద్రతలగుడ్డలు చూచి జవ్వనులువలచి పైఁబడి వెంట పరుగెత్తుదురుకాఁబోలును! ఆవచ్చుచున్నవాఁడువిక్రమసేనుఁడు కాఁడా! అతఁడే. సందేహము లేదు. అతఁడొకవేళ తనకృషిలో సాఫల్యమునొందినాఁడేమో! పొందినపక్షమున నా మనస్సునూరట కలుగదు. అతఁడిప్పుడు మాటాడుచున్న దెవరితో నయియుండును!

(అని ప్రక్కకు నడుచుచున్నాఁడు.)

[విక్రమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విక్ర—(తనలో) నేను పన్నిన తంత్రమంతయు నిరర్థకమయినది. ఇట్టుగంటి మాయోపాయములు పన్నిన పాపఫల మనుభవింపవలసినదే. ఆమె పౌరుష మిట్టిగతి తెచ్చునని నేను స్వప్నావస్థలోను తలఁపలేదు. ఆమెది పట్టి జాతిగుండె: నేనుపుట్టి బుద్ధియెఱిఁగినతరువాత నిటువంటిదురవస్థను నేనెప్పుడు ననుభవించి యెఱుఁగను. నా కొంతుకనుగాని నాకడ్డువచ్చిన మఱియెవ్వరికొంతుకనైనను గాని నేనిప్పుడు నిర్విచారముగా కోయఁగలను.

పురు—ఓహో! ఇప్పుడు నాయదృష్టము ఫలించినది. నాభాగ్యముచేత నేను మంచిసమయమునకు వచ్చినాను. నాపని కనుకూలముగా నితఁడిప్పటికంటె మంచి స్వభావములో మఱియెప్పుడు నుండఁడు, కాఁబట్టి యిప్పుడే యితనితో ప్రసంగ

మారంభించి కలహము పెట్టుకోవలెను—(అని విక్రమసేనునియొద్దకు నడిచి) విక్రమసేనా! ఆవిషయములో నీయభిప్రాయములో నే నేకీభవింపఁజాలను.

విక్ర—వాదవిషయములో నీవు మహాపండితుఁడవయినట్టున్నావే. నే నేయభిప్రాయమును తెలుపనిదే నాయభిప్రాయములో నేకీభవింపఁజాలకున్నావు!

పురు—నీవుచెప్పినది సయుక్తికముగాలేదు. ఒకమనుష్యుఁడు సత్యములయిన మాటలు పలుకఁగలిగినట్లే పయికి తెలుపక పోయినను లోపల నసత్యములయిన యభిప్రాయములను గలిగియుండవచ్చును.

విక్ర—అది సత్యమే కాని యొకమనుష్యుఁడు తన యభిప్రాయములను పయికి తెలుపకున్నంతవఱకు పరులతో కలహకారణము కలుఁగదని నేను భావించెదను.

పురు—అట్లయినపక్షమున, ఈవిషయములోనే మనకిద్దఱకు నభిప్రాయభేదము కనఁబడుచున్నది. వివాదమున కిదియే తగినంత కారణము కావచ్చును.

విక్ర—నీవు పెద్దమనుష్యుఁడవని నేనీవఱకు తెలియఁగనివాఁడనయి యుండినపక్షమున నీవిషయమున నేనిప్పుడు దురభిప్రాయ పడియుందును. నాతో వివాదము పెట్టుకొనుటయే నీయభిప్రాయము కాకపోయినపక్షమున, ఇప్పటి నీమాటల యభిప్రాయమేమో నాకు తెలియకున్నది.

పురు—నీవు కూశాగ్రబుద్ధివి. నాయభిప్రాయమును సరిగా కనిపెట్టినావు. (వంగి నమస్కరించి) నానోటినుండి రావలసినమాట ముందుగా నీనోటినుండియే వచ్చినది. నేనిప్పుడు నిన్ను యుద్ధభిక్షవేఁడుటకయి వచ్చినాను.

విక్ర—అట్లయినపక్షమున నీమనోరథమును నేను విఫలముచేయరాదు. మంచిది. నీవుకోరినట్లే చేసెదను. అయినను నీవు నాతో పోరాఁడఁగోరుటకుఁగల కారణమేమో యనుగ్రహించిన పక్షమున సంతోషించెదను.

పురు—అవిషయమయి నీమనస్సు నాయాసపెట్టఁబోకు. ఇప్పుడున్నట్టుగా మన కలహము మహాదివ్యమైన కలహము. దీనికి కారణమును దెలిపి మనమిప్పుడు దీని సారస్యమును చెడఁగొట్టకూడదు. నీకు మఱపు మిక్కిలి యెక్కువ. కాకపోయిన పక్షమున వారము దినములలోపల నీవు నాకుచేసిన యపకారమును నీవింతలో మఱచియుండవు. ఆవిషయమయి మనకు వాదులాట యక్కఱలేదు. యుద్ధమునకు నీకు స్థలమెక్కడనో యనుకూలకాల మెప్పుడో మాత్రముచెప్పు.

విక్ర—నీ వంతయభిలాష పడుచున్నావుగనుక, నీయుబలాటమెంత శీఘ్రముగా తీరినంతమంచిది. అది యీసాయంకాలమే జరగవచ్చును. ఇక్కడనే యీచేరువ తోఁటలలోనే కావచ్చును. ఇక్కడ మనపనికి విఘ్నముచేయువా రెవ్వరునుండరు

పురు—ఎవ్వరో తుచ్ఛులుగాని యిటువంటి విషయములలో పెద్దమనుష్యులకష్టమును విఘ్నములుచేయరు. కారణమేమో తెలియదుగాని యీదేశములో నిటువంటి విషయము కొంచెము పట్టిన పొక్కఁగానే జనులు పెద్దగొల్లుచేసి పెద్దమనుష్యులను సుఖముగా నెమ్మదితో పోనీయనియ్యరు. నాకీసాయంకాల మేడుగంటల కీరాజా గారి జనోద్యానవనములోఁ గొంచెము పనియున్నదిగనుక, నీకాక్షేపణలేనిపక్షమున మనమక్కడ కూడుకొనుట నాకనుకూలముగానుండును. ఏకక్రియాద్వ్యర్థకారియన్నట్లు నేను రెండుపనులు నొక్కసారియే చక్కఁబెట్టవచ్చును.

విక్ర—ఇది నాకును సమ్మతమే. ఆయేడుగంటలయినతరువాత మనమక్కడకలిసికొని సర్వమును సావకాశముగా నేర్పాటు చేసికొందము.

పురు—నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. అప్పుడు మీరమునుండి తుపాకులతో పోరాడుటకు మంచిసమయము కాకపోయినను చేయవలసినయెడల కత్తులతో యుద్ధముచేయుటకు తగినంత వెలుతురుండును. ఇంతకును వచ్చినపని యనుకూలముగా ముగిసినది. ఇఁక నామనస్సానందము పొందును. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అంత దర్పసారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విక్ర—మంచిసమయమునకు వచ్చినావు. ఓదర్పసారా! నీనిమిత్తము నేనే రావలెననుకొనుచున్నాను. నాపాలిటి యదృష్టదేవతయు సర్వభూతములను సమస్తమును నాకిప్పు డెదురుతిరిగినవి. నామనస్సునకును విసుగుపుట్టి నేను నిరుత్సాహుఁడనయి యున్నాను. నాభుజవీర్యము చూపి వీరశయనము పొందుటకు నాకిప్పు డవకాశము లభింపకుండినపక్షమున, నేనీదుఃఖకథను నీతో చెప్పలేక పోయియేయుందును.

దర్ప—నీభావమేమో నాకు బోధపడకున్నది. కళావతి తన మనస్సు మార్చుకొన్నదాయేమి? పెద్దలయొక్క యాజ్ఞకూడ నిప్పుడాచిన్నదానియొక్క యిష్టమునకే యనుకూలపడినదని విన్నానే!

విక్ర—ఆమెయిష్టము నాకనుకూలముగా నున్నప్పుడు పెద్దలయాజ్ఞ ప్రతికూలముగా నుండినది. ఇప్పుడు పెద్దలయాజ్ఞ నాకనుకూలముకాఁగానే యామెయిష్టము ప్రతికూలముగా తిరిగి నన్ను తిరస్కారభావముతోఁ జూచుచున్నది.

దర్ప—నీవింకఁ జేయఁదలఁచుకొన్న దేమి?

విక్ర—వేయిమాటలెందుకు? నాకడమాటవిను. ఇప్పుడొక్క పెద్దమనుష్యుఁడు వచ్చి తన్ను నాగొంతుక కోయనిమ్మని కోరినాఁడు. నేనాతని కోరిక చెల్లింపఁదలఁచుకొన్నాను. అంతయు నిరికే

దర్ప—ఈవక్రభాషలుమాని తిన్నఁగా చెప్పు

విక్ర—ఇప్పుడు నేను చెప్పినది స్వప్నభాషణము కాదు, సత్యమే. నేనిప్పుడు నీదయా మద్దేశింపక పోయినను నేనేమో తనకేదో యుపకారము కలుగఁజేసితినని చెప్పి పురుషోత్తమదేవుఁడు వచ్చి నన్ను సాయంకాల మారుగంటలకు తనతో యుద్ధమునకు రమ్మని పిలిచినాఁడు. ఈవిషయమయియే నేను నీవద్దకు రావలెననుకొన్నాను. నీవు నాతోడు రావలెను.

దర్ప—ఇందులో నేదో భ్రమయున్నది. ఈసంగతిని పురుషోత్తమదేవుఁడే వివరముగాఁ జెప్పి సమాధానపడుటకు సందేహముండదు. ఇది మరియొకవిధమైన బాగుండును. నీవు చెప్పినది యీసాయంకాల మనేనా? మఱియొక సమయమయిన ననుకూలముగా నుండును.

విక్ర—అనుకూలము కాకేమి? అప్పుడు తగినంత వెలుతురుండును. పురుషోత్తమదేవుఁడు చెప్పినట్లుగా దూరమునుండి తుపాకులతో పోరాడుటకు మంచిసమయము కాకపోయినను చేతఁబట్టి కత్తులతో యుద్ధముచేయుట కనుకూలముగానే యుండును. తుపాకులతో పోరాటమఁట! వాని తుపాకులు కాలిపోను!

దర్ప—చారుమతితో సంభవించిన వివాదమునుబట్టి నామనస్సిప్పుడు మంచిస్థితిలో లేదు. పీడాకరమైన నాదుస్స్వభావమునుబట్టి నేననాదరణచూపి నిష్కారణముగా నాప్రియురాలి మనస్సు నొప్పించుచున్నాను. ఆవివాదము తీఱి యామె మనస్సు సమాధానపడునంతకు నేను మరల పూర్వపు దర్పసారుఁడను కాఁజాలను.

విక్ర—దర్పసారా! నీవు నిజముగానే చారుమతి కర్హుఁడవు కావు.

[ఒక చేటిక యుత్తరము తెచ్చి దర్పసారుని చేతిలోఁ బెట్టి నిష్క్రమించుచున్నది.]

దర్ప—ఓవిక్రమా! ఇది చారుమతి వ్రాసినది. దీనిని విప్పుటకు నాకుభయమగుచున్నది. ఇదే నీకును నాకును కడపటిసెలవని యిందు వ్రాసినదేమో! తాను వ్రాసిన యుత్తరముల నన్నిటిని మరల తనవి తనకుఁ బంపుమని వ్రాసినదో!—ఆహా! నేనిప్పుడు స్వయంకృతాపరాధ ఫల మనుభవించుచున్నాను.

విక్ర—అది నాచేతికిమ్ము (అని యుత్తరమును బుచ్చుకొని విప్పి) ఇందులో నొకటే వాక్యమున్నది. ఇఁక నీపని యయిపోయినది.

దర్ప—విక్రమా! నన్నింక బాధింపక యున్నదేమో చెప్పుము.

విక్ర—ఆ! అట్లయినయెడల చదివెదను విను. (అని చదువుచున్నాఁడు.) "నాచర్యలచేఁ జేసినయనాదరము నిమిత్తము క్షమాపణ వేఁడుచున్న దర్పసారుని నీవెంతకాలము మనస్సు పరితాపపెట్టి శిక్షించియుందువని నేను నిశ్చయముగా నెఱుఁగఁదాన. సందున, సేనానివనుఁడనమై యెట్టిపనియు మద్దిష్టింపక యొక్కసారి వచ్చి సాధ్యమయిన యెడ

క్రమముగా దర్పకమిచ్చిపోయినట్టి మాత్రము నాహృదయేశ్వరిని వేఁడుచున్నాను. ఇట్లు భవత్పాదసేవకురాలు—చారుమతి" ఆమె యెట్లు మూర్ఖపుపట్టుపట్టి నీమీఁద పగతీర్చుకొనుచున్నదో చూచినావా? (అని యుత్తరమును చేతికిచ్చి) ఇది విన్నపిమ్మటఁగూడ నీవేమియు సంతోషముగా నున్నట్టు కనఁబడకున్నావే!

దర్ప—నేను సంతోషముగానే యున్నాను. కాని—

విక్ర—నీకానులు గీనులు దూరముగాపెట్టు. ఇతరులవల్ల నుల్లాసకరమయిన మాట విన్నప్పుడు సంతోషించి యూరకుండక వెంటనే "కాని" యన్న పనికిమాలిన మాటనొకటిపెట్టి నీవెప్పుడును సంతోషభంగమును చేయుచునే యుందువు.

దర్ప—అవునుగాని, విక్రమసేనా! నీవు నాప్రాణస్నేహితుఁడవు గనుక నిన్నొక్కమాట యడిగెదను, న్యాయమైన యుత్తరము చెప్పు. సంధిగోరుచు వ్రాసిన యీ యుత్తరములో కొంచెమైనఁ జేగిరపాటును రసహీనతయు నున్నదా లేదా? సమాధాన వాక్యము చెప్పుటను మొట్టమొదట పురుషులవద్దనుండి రావలెనుగాని స్త్రీలవద్దనుండి రాఁగూడదుగదా? పురుషులు ప్రార్థించి దీనాలాపములచేత తమమనస్సులను కరఁగించు వఱకును తరుణులు తాముదాసీనతను నటింపవలెను. వారి వలపువలెనే వారి తమకము నయూచితముగా తనంతట బయలఁబడఁగూడదు.

విక్రి—నీమాటలు వినుటకు నాకిష్టములేదు. ఇఁక నీకెంతచెప్పినను కార్యము లేదు. ఈవిషయమయి నాతో మాటాడకు. నేనీలోపుగా కొన్నిపనులు చేసికొనవలసి యున్నవి. నీవు నేఁడు సాయంకాలములోపల మాయింటికివచ్చి మఱచిపోక నాతో మాటాడి మరిపో. మనోరథసిద్ధికొఱ కెంతో కష్టపడి యెన్నో మాయలుపన్ని విశ్వ ప్రయత్నములుచేసి తుదకు పరిణామమువలన ఆశాభంగముఁబొందిన నావంటి వాఁడు కొంచెము విచారపడి విసుఁగుకొన్నఁ గొంత యందమును చందమునుగా నుండును గాని యేకష్టమును లేక యప్రయత్నముగా కార్యసిద్ధియైనప్పుడు సుఖముగా ననుభవింపలేక కుడిచి కూర్చుండి లేనిపోని కష్టములు కల్పించుకొని నీవంటివాఁడు విసుఁగుకొన్న పరిహాసపాత్రుఁడు కాకమానఁడు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

దర్ప—ఇతఁడన్నమాటలు నామనస్సునకు నాటుకొన్నవి. అయినను నాగుణము మార్చుకొని పనికిమాలిన సంతుష్టిపొంది యూరకుండఁజాలను. ద్వంద్వయుద్ధమునకు సహాయుఁడవుకమ్మని యితఁడడుగుటచేత నాకిప్పుడొక యాలోచన తోఁచుచున్నది. నేనీయుద్ధములో ప్రవేశించి యిందుమూలమున చారుమతికి నామీఁద నిజమైన ప్రేమయున్నదో లేదో పరీక్షచేసి చూచెదను. ఈపరిశోధనవలన నామెవలపు నిర్మలమయినదిగా తెలియవచ్చునేని, నేను ధన్యతముఁడనయి నాసందేహములు విడిచి

